ఉదయం ***
విజయవాడ
సోమవారం
16—7—73
THE ANDHRA PATRIKA
Regd. H. No. 506
PUBLISHED SIMULTANEOUSLY FROM MADRAS& VIJAYAWADA

# ఆంధ్రపత్రిక

FOUNDER: DESODHARAKA K.NAGESWARA RAO
సంపుటం : 60
సంచిక : 104
పుటలు : 4
వెల : 16 పైసలు



# అహమ్మదాబాద్‌లో దహనకాండ కర్ఫ్యూ: 25 సార్లు పోలీస్ కాల్పులు

అహ్మదాబాద్, జూలై 15 :

గతరాత్రి ఇక్కడ వరుసగా అనేక ప్రాంతాలలో దోపిడికి, దహన కాండకు పాల్పడిన జనసమూహాలను చెదరగొట్టేందుకు పోలీసులు 25 సార్లు తుపాకి కాల్పులు జరుపగా ఒక వ్యక్తి మరణించాడు; మరో ఆరుగురు గాయపడ్డారు.

అల్లరి జనం ఖడియా, సరంగ్‌పూర్, రాయ్‌పూర్, వాడిగాయ్ ప్రాంతాలలో సుమారు 12 దుకాణాలను తగులబెట్టారు. మరో 14 దుకాణాలను దోచుకున్నారు.

నిన్నరాత్రి 9 గంటల తరువాత ఖడియా ప్రాంతం సమీపాన జన సమూహం ఒక బస్సుకు నిప్పు అంటించడంతో దవుర్జన్య కాండ ప్రారంభమైంది.

పోలీసు అధికారులు వెంటనే ఖడియా ప్రాంతంలో కర్ఫ్యూ విధించి, నగర పోలీసులను, రాష్ట్ర రిజర్వు పోలీసులను హుటాహుటిని అక్కడకు తరలించారు. దవుర్జన్యకాండ ఇతర పేటలకు కూడా వ్యాపించడంతో నగరమంతటా కర్ఫ్యూ విధించబడింది. కర్ఫ్యూ నేటి అర్ధరాత్రి వరకు అమలులో ఉంటుంది.

నిన్నరాత్రి అల్లరి మూకలు బస్సును తగులబెట్టిన దరిమిలా దహనకాండకు పాల్పడే వారిని తుపాకితో కాల్చి వేయవలసిందిగా పోలీసులకు ఉత్తర్వులు జారీ అయ్యాయి. రవుడీలను నిర్బంధించేందుకు కూడా ఉత్తర్వులు ఇవ్వబడ్డాయి.

"కంగ్రెసు పార్టీలో అంతః కలహాల పట్ల, గుజరాత్‌లో అక్రమ రాజకీయ జీవితం పట్ల" నిరసనగా నిన్న "అహ్మదాబాద్ బంద్"కు నాగరిక్ సమితి ఇచ్చిన పిలుపునకు ఈ దవుర్జన్య కాండకు సంబంధం ఉన్నదేమో తెలియ లేదు

జనం రాళ్లు రువ్విన కొద్దిపాటి సంఘటనలు సంభవించినా బంద్ దాదాపు ప్రశాంతంగానే ముగిసింది. విద్యార్థులు పాఠశాలలకు, కళాశాలలకు హాజరు కాలేదు.

కల్లోలిత ప్రాంతాలలో రాష్ట్ర రిజర్వు పోలీసులు గస్తీ తిరుగు తున్నారు.

నేడు అవాంఛనీయమైన సంఘటన లేవీ సంభవించక పోవడం, పరిస్థితి పూర్తిగా అదుపులో ఉండటం దృష్ట్యా ప్రభుత్వం ఈ మధ్యాహ్నం 2 గంటల నుంచి 4 గంటల వరకు కర్ఫ్యూను సడలించింది.

ముఖ్యమంత్రి శ్రీ ఘనశ్యామ్ ఓరుగా పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ పి. ఎం. పంత్, పోలీసు కమీషనర్ శ్రీ ఎఫ్రెకరెన్ని సన్ వెంటరాగా, కల్లోలిత ప్రాంతాలకు వెళ్ళి పరిస్థితిని పరిశీలించారు.

ప్రశాంతతను కాపాడవలసిందని ముఖ్యమంత్రి ప్రజలకు విజ్ఞప్తి చేస్తు, సంఘవిద్రోహశక్తుల కార్యకలాపాలను ధృఢంగా అణచివేయడానికే ప్రభుత్వం కృత నిశ్చయమై ఉన్నదని తెల్పారు. వదంతులను వ్యాపింపజేసే వారిని నమ్మవద్దనీ, వారు సమాజానికి ప్రథమ శత్రువులని ఆయన ప్రజలను హెచ్చరించారు.

ముఖ్యమంత్రి పురప్రముఖులను సమావేశపరచి, పరిస్థితిని గూర్చి వారితో చర్చించారు. పరిస్థితిని చక్కబరిచేందుకు ప్రభుత్వం తగు చర్యలు తీసుకున్నదని వారికి హామీ ఇచ్చారు.

సంఘ విద్రోహ శక్తులను అణచి వేసేందుకు అవసరమైనంత బలప్రయోగం చేయవలసిందని పోలీసులకు శ్రీ ఓరుగా ఆదేశాలు ఇచ్చారు.

## పరీక్షల బహిష్కరణ : కాలేజి అధ్యాపకుల సంఘం విజ్ఞప్తి

విజయవాడ, జూలై 15 : ఎ. సి. టి. వి. సారథ్యసంఘం యీనాడు సమావేశమై కళాశాల అధ్యాపకుల సమ్మె పరిస్థితిని సమీక్షించింది. ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయాలు మరియు ఇంటర్మీడియట్ బోర్డు వారు పరీక్షలను షెడ్యూలు ప్రకారము జరపాలని నిర్ణయించిన తరువాత యేర్పడిన పరిస్థితిని సారథ్య సంఘం పరిశీలించింది. సమ్మె చేస్తున్న అధ్యాపకులు, ఇతరులు కూడా పై పరీక్షలకు సంబంధించిన యావత్తు పనిని బహిష్కరించవలసిందిగా సారథ్య సంఘం కోరుతున్నది. గెజెటెడ్, నాన్–గెజెటెడ్ ఉద్యోగులు, ప్రభుత్వ కళాశాలల అధ్యాపకులు, జూనియర్ కళాశాలల అధ్యాపకులు, ఇంకా యితర ఉద్యోగులు ప్రభుత్వం పరీక్షలు నిర్వహించేందుకు తమ సహాయాన్ని అర్థించిన పక్షంలో అందుకు ఒప్పుకోవద్దని, అధ్యాపకుల ఉద్యమాన్ని బలహీన పరచవద్దని సారథ్య సంఘం విజ్ఞప్తి చేస్తున్నది. తన బ్రాంచి అసోసియేషనులను స్థానిక ఉద్యోగ సంఘాలతో యెప్పటికప్పుడు సంబంధం కలిగియుండి వారిని పరీక్షలకు సంబంధించిన యే పనులు చేయవద్దని కోరవలసినదిగా తీర్మానించినది.

న్యాయసమ్మతమైన అధ్యాపకుల ఆకోర్కెలకు ప్రభుత్వం అంగీకరించిన మరుక్షణంలో సమ్మె విరమించగలమని సారథ్య సంఘం మరోసారి అందరికీ స్పష్టం చేస్తున్నది.

(మిగతా 3 వ పేజీలో)

సేకరణ ధరకన్నా కొంచెం అధిక ధరకి గోధుమ దొరుకుతుంది
గోధుమ దొరుకుతుంది! ధరల్లు మాత్రం అధికం!
రైతు
విదేశీ వ్యాపారులు
ఎవరి దగ్గర కొనాలి?

# ఆంధ్ర సమస్య సత్వర పరిష్కారానికి సర్వత్రా శ్రద్ధ: సుబ్బారెడ్డి ప్రభృతులతో చర్చల అనంతరం బ్రహ్మానందరెడ్డి వెల్లడి

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, జూలై 15 : "భారత ప్రభుత్వం నేను, మాట్లాడిన వివిధ అభిప్రాయాలుకల పెద్దలు ప్రస్తుత సమస్యకు శీఘ్రమైన పరిష్కారం లభించాలనే శ్రద్ధ, కుతూహలంగా ఉన్నాము. ప్రత్యేకవాద నాయకుల అభిప్రాయాలు నేను తెలుసుకున్నాను" అని ఆరవ ఆర్థిక విచారణ సంఘం అధ్యక్షుడు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి శ్రీశైలం నుంచి తిరిగి వచ్చాక సోమాజీగూడాలోని తన బసలో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ చెప్పారు.

నిన్నరాత్రి దాదాపు మూడు గంటల సేపు ఈ వేళ ఒక అరగంటసేపు శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, శ్రీ పి. బసిరెడ్డి, శ్రీ మూర్తిరాజు, శ్రీ కందుల ఓబులరెడ్డి గారలతో మాట్లాడి వారి అభిప్రాయాలను ఆయన తెలుసుకున్నారు. కేంద్రం ఏదైనా ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు చేస్తే సమితి సర్వసభ్య సమావేశం దగ్గరపెడతామని ఇది వరకే వారి కార్యవర్గం తీర్మానించిందని చెప్పారని శ్రీ బ్రహ్మానందరెడ్డి అన్నారు. శ్రీ సుబ్బారెడ్డి అటు కోంగలకుంట్ల వెళ్ళిపోయారు. శ్రీ బసిరెడ్డి, శ్రీ మూర్తిరాజు, శ్రీ కృష్ణమూర్తినాయుడు ఇవ్వాళ రాత్రి శ్రీశైలం నుంచి తిరిగివస్తారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి 18న వెళ్లేలోపల వారిని కలుసు కుంటారు.

ప్రత్యేక వాదులు ఏ పరిష్కారానికైనా ఒప్పుకున్నారా? అన్న ప్రశ్నకు శ్రీ బ్రహ్మానందరెడ్డి "వారు ఒప్పుకుంటారో, ఒప్పుకోరో తాము ముందు ఏ మాట చెప్పటం భావ్యం కాదని, ఏదైనా ప్రజలకు ఏది హితమో, ప్రజాభిప్రాయం ఏలా ఉంటుందో అన్నివాదు సమర్థించవలసి వుంటుంది గదా అని శ్రీ బ్రహ్మానందరెడ్డి అన్నారు.

శ్రీ బ్రహ్మానందరెడ్డి ఢిల్లీ వెళ్ళాక ప్రధానమంత్రికి ఇక్కడ విషయాలు గూర్చి నివేదిస్తారు. తెలంగాణా కాంగ్రెసు ప్రత్యేక వాదులు చాలా మంది తమను వచ్చి కలిశారనీ, వారి అభిప్రాయాలు తెలుసుకున్నామనీ, కేంద్రం గానీ, తాము గాని తాము మాట్లాడిన వారు గాని ప్రజాశ్రేయస్సునే దృష్టిలో వుంచుకోవలసి ఉంటుందనీ శ్రీ బ్రహ్మానందరెడ్డి అన్నారు.

సంభాషణలను గూర్చి ఆశావహంగా ఉన్నారా అన్న ప్రశ్నకు సమాధానంగా ఆశలేదని ఎవరైనా ఎప్పుడైనా చెబుతారాఅనీ, అటువంటి ప్రశ్న అనవసరమనీ శ్రీ బ్రహ్మానందరెడ్డి అన్నారు. ఈ నెలాఖరులోపల పరిష్కారం వస్తుందని ఆశిస్తున్నారా అన్న ప్రశ్నకు బదులు ఏలా చెప్పగలమనీ, అది అందరూ ఇచ్చే సహకారం పై ఆధారపడి ఉంటుందనీ ఆయన అన్నారు.

శ్రీ బ్రహ్మానందరెడ్డిని ఈ సాయంత్రం సర్వశ్రీ జె. చొక్కారావు, కె. రామిరెడ్డి, పి. గోవర్ధనరెడ్డి, పి. నరసారెడ్డి, బి. పురుషోత్తమరెడ్డి, గెడ్డన్న, వావిలాల గోపాలకృష్ణయ్య కలిదిండి విజయనరసింహరాజు, పార్లమెంటు సభ్యుడు శ్రీ ఎం. రామగోపాలరెడ్డి, కాసు

(మిగతా 3 వ పేజీలో)

## శ్రీ తాపీ చాణక్య కాలధర్మం

మద్రాసు, జూలై 15 : శ్రీ తాపీచాణక్య, ప్రసిద్ధ ఫిల్మ్ డైరెక్టరు, హటాత్తుగా సుస్తీ చేసి, గత రాత్రి ఇక్కడి నర్సింగ్‌హోంలో కాలధర్మం చెందారు. ఆయన వయస్సు 48. భార్య, కుమార్తె వున్నారు.

శ్రీ చాణక్య, ఈ మధ్యనే కాలధర్మం చెందిన ప్రసిద్ధ రచయిత శ్రీ తాపీధర్మారావు గారి కుమారులు. శ్రీ చాణక్య పెక్కు తెలుగు, తమిళ, హిందీ సినిమాలకు డైరెక్టరు. అందులో రోజులు మారాయి (తెలుగు) ఎంగల్ వీటుపిళ్లై (తమిళం) రామ్ అవుర్ శ్యామ్ (హిందీ) ప్రసిద్ధాలు. "సీతా అవుర్ గీతా" తమిళ, తెలుగు చిత్రాలను ప్రస్తుతం డైరెక్టు చేస్తున్నారు.

## గుజరాత్ పార్టీ నాయకత్వం: పోటీదార్ల నమ్మకం

అహ్మదాబాద్, జూలై 15 : గుజరాత్ కాంగ్రెసు పార్టీ నాయకత్వాన్ని వాంఛిస్తున్న నాయకులు ఇద్దరూ నిన్నను గాంధినగర్‌లో జరిగిన ఎన్నికలో తామే గెలుపొందగలమనే విశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నారు.

అసంతృప్తివర్గం నాయకుడు శ్రీ చిమన్ భాయ్ పటేల్ "నేను గెలుస్తాననే నమ్మకం వుంది" అనగా, ఆయన ప్రత్యర్థి శ్రీ కాంతిలాల్ ఘియా "నాకు అవకాశాలు మెరుగుగా వున్నాయి" అన్నారు.

ఎన్నికలకు తాను వెనుకంజ వేయనని అయినా పార్టీలో ద్వేషాలను నివారించడానికిగాను అధిష్టానవర్గం చెప్పినట్లు వినాలనే సూచన చేశామని శ్రీ పటేల్ పట్టుపట్టడంతో మరో ఆలోచన లేకుండా పోటీకి అంగీకరించామని కూడా శ్రీ ఘియా చెప్పారు.

ఈ పోటీ ఫలితం సోమవారం ఢిల్లీలో తెలుస్తుంది. శ్రీ పటేల్, శ్రీ ఘియా సోమవారం ఢిల్లీకి బయలు దేరుతున్నారు.

# అధిష్ఠాన వర్గం పిలుపు: డి. పి. మిశ్రా తిరస్కృతి ?

భోపాల్, జూలై 15 : సంప్రదింపుల నిమిత్తం ముఖ్యమంత్రి శ్రీ పి. సి. సేథీ నిన్న రాత్రి ఢిల్లీకి, అసమ్మతి వర్గం వారు జబల్పూర్‌కు బయలుదేరి వెళ్ళడంతో, సున్నముందు కలిగే పరిణామాలపై వ్యాఖ్యానించడానికి ఎవరూ యిష్టపడటం లేదు.

జబల్పూర్ వెళ్ళిన వారిలో అసమ్మతివర్గం నాయకుడు శ్రీ గౌతమ్‌శర్మ, పరిశ్రమల మంత్రి, నిన్న రాజీనామా చేసిన మంత్రులలో ఒకరు అయిన శ్రీ పరమానందభాయ్ పటేల్ ఉన్నారు.

ఈ లోగా కొద్దిమంది అసమ్మతి వర్గీయులు ముఖ్యమంత్రి శ్రీ సేథీకి వ్యతిరేకంగా సంతకాలు సేకరించే ప్రయత్నంలో నిమగ్నులై వున్నారు. అయితే వారు ఇంత వరకు ఎన్ని సంతకాలు సేకరించగలిగారో స్పష్టంగా తెలియలేదు. అయితే శ్రీ సేథీ అనుకూలురు కూడా ఆయనకు గణనీయమైన మద్దతు లభించడానికి గట్టిగా కృషి చేస్తున్నారు.

ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా వందమందికి పైగా సభ్యుల సంతకాలు సేకరించగలిగామని అసమ్మతి వర్గం నాయకుడు ఒకరు నిన్న తెల్పగా 25 మందికి మించి శాసనసభా పార్టీ సభ్యులు ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా సంతకాలు చేసి వుండరని శ్రీ సేథీ పట్ల సంపూర్ణవిశ్వాసం ప్రకటిస్తున్నవారు తెల్పారు.

అసమ్మతివర్గం నాయకుడు శ్రీ డి. పి. మిశ్రాకు ఢిల్లీ రావలసిందిగా అధిష్టానవర్గం నుంచి పిలుపు వచ్చింది. అయితే ఆయన అస్వస్థులుగా ఉన్నారనీ, మరో రెండు రోజులుపాటు జబల్పూర్‌లోనే ఉండగలరనీ తెలిసింది. సంప్రతింపులు జరుపడానికి వీలుగా తాము జబల్పూర్‌లో ఉండగలమనీ ఆయన

( మిగతా 3 వ పేజీలో)

# పాక్‌తో చర్చలలో దృఢ వైఖరి: జనసంఘం విజ్ఞప్తి

హుబ్లీ, జూలై 15 : జన సంఘం కేంద్ర కార్యవర్గం సమావేశం ఇక్కడ జరుగుతున్నది. ఈ సందర్భంలో శ్రీ జగన్నాథరావుజోషి ఎమ్. పి. పత్రికల వారితో మాట్లాడుతూ, పాకిస్తాన్‌తో భారత్ చర్చలు జరుపడానికి తమ పార్టీ ఎన్నడూ వ్యతిరేకం కాదని, అయితే చర్చలలో భారత్ లొంగిపోయే వైఖరి చేపడితే తమ పార్టీ వ్యతిరేకిస్తుందని చెప్పారు.

ఇస్లామాబాద్ సమావేశంలో యుద్ధ ఖైదీల సమస్య పైనే చర్చ జరిగేటట్లు చూడడానికి పాకిస్తాన్ వేసే ఎత్తులకు భారత్ లొంగిపోరాదని, పాకిస్తాన్‌లకివున్న బెంగాలీలను, బంగ్లాదేశ్‌లోని పాక్ జాతీయులను మార్పిడి చేసే విషయమై భారత్ చర్చలలో దృష్టిని కేంద్రీకరించాలని ఆయన అన్నారు.

ఇస్లామాబాద్‌లో ఈ నెల 24న భారత్ పాక్‌ల మధ్య అధికారుల స్థాయిలో సమావేశం జరుగుతున్నది.

1971 యుద్ధం సమయంలో సింధు నుంచి మన దేశానికి వచ్చిన లక్ష మంది కాందిశీకులకు పునరావాసానికి కొంతభూభాగాన్ని మనకు యివ్వాలని పాకిస్తాన్‌ను గట్టిగా కోరాలని జన సంఘం కార్యవర్గం ఒక తీర్మానంలో భారత ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది.

ఛాంబ్ సమస్యను కూడా ఈ సారి చర్చలలో తప్పకుండా ప్రస్తావించాలని, ఛాంబ్‌లోని దురాక్రమణను ఖాళీ చేయాలని పాక్‌ను కోరాలని, 35 వేల మంది కాందిశీకులు తమ స్వస్థలాలకు తిరిగి వెళ్ళాలంటే ఛాంబ్‌లో దురాక్రమణను తొలగి పోవాలని కార్యవర్గం పేర్కొన్నారు.

ఈ తీర్మానంలో ఇంకా యిలా వున్నది: పాకిస్తాన్ భారత్‌కు ఇప్పటికీ ప్రమాదంగానే వున్నది. అమెరికా నుంచి ఆయుధాలను, ఇరాన్ ద్వారాపొంది 1971 యుద్ధంనాటి కంటే ఎక్కువ ఆయుధశక్తి సంపాదించింది.

"వాషింగ్టన్ పోస్టు" విలేఖరికి భుట్టో యిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పిన మాటలను బట్టి పాకిస్తాన్ ప్రతీకార వైఖరితో వున్నదని తెలుస్తున్నది.

## జూలై 18న విషాదదినం సత్యనారాయణరెడ్డి ప్రకటన

హైదరాబాద్, జూలై 15 : ఆంధ్రప్రదేశ్‌ను ఆంధ్ర, తెలంగాణా అనే రెండు రాష్ట్రాలుగా విభజించటంలో భారత ప్రభుత్వం విఫలం అయినందుకు నిరసనగా, జూలై 18 తేదీని, "విషాదదినం"గా పాటించటం జరుగుగలదని ఒక ప్రకటనలో, తెలంగాణా ప్రజాసమితి అధ్యక్షుడు శ్రీ బి. సత్యనారాయణరెడ్డి తెలియచేశారు.

నిరసన సభలు, జరిపి, నల్ల బ్యాడ్జీలను ధరించటంద్వారా 18 వ తేదీన యీ విషాద దినం పాటించవలసిందిగా, ఆయన అన్ని వర్గాల ప్రజలకీ విజ్ఞప్తి చేశారు.

## చేనేత పరిశ్రమకు ప్రాధాన్యత లక్ష్యంగా

# జౌళి విధానం పునఃపరిశీలన : శ్రీ ఛటోపాధ్యాయ ప్రకటన

ఆంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాద్, జూలై 15 : చేనేత పరిశ్రమ ప్రధానమైన ఇప్పటికంటేవిస్తృతమైన పాత్ర నిర్వహించగలిగే విధంగా, జవులి విధానాన్ని పునఃపరిశీలించడం జరుగగలదని కేంద్రవాణిజ్యమంత్రి ప్రొఫెసర్ డి. పి. ఛటోపాధ్యాయ నేడు తెలియ జేశారు.

ఇక్కడ కర్వాన్‌లో హైదరాబాద్ చేనేత పనివారి కేంద్ర సహకార సంఘం లిమిటెడ్ కి చెందిన ఆదర్శ నేత కేంద్రానికి (మాడల్) వీవింగ్ సెంటర్ ఆయన నేటి ఉదయం శంకుస్థాపన చేశారు. మాజీమంత్రి శ్రీ కొండాలక్ష్మణ్‌బాపూజీ అధ్యక్షత వహించారు.

నేతపనివారు వారి నాయకులూ, ప్రభుత్వం సహకారంతో ఆదర్శనేత కేంద్రం ఆశయాలు నెరవేరగలవని ఆశాభావం, ప్రొఫెసర్ ఛటోపాధ్యాయ వ్యక్తం చేశారు.

వారి న్యాయమైన కోర్కెలు సమ్మతించ బడేరీతిగా, పరిశ్రమ అభివృద్ధికి ప్రభుత్వం ఆసక్తి వహించేట్లుగా నేతపనివారు చక్కగా వ్యవస్థని ఏర్పాటు చేసుకోవాలని ఆయన ఉద్బోధించారు.

సంఘం అధ్యక్షులు శ్రీ బి. శ్రీరాములు అతిథులకి స్వాగతం చెబుతూ నేతపనివారికి డిజైన్‌లలోను, మెరుగైన పద్ధతి నేతలోను శిక్షణ యివ్వాలని ఆదర్శనేత కేంద్రాలు వుండవలసిన ఆవశ్యకతని వివరించారు.

తమ సంఘం నిర్వహించే అయిదు ఆదర్శనేత కేంద్రాలలోను నేతపనివారికి ప్రభుత్వం నిర్ణయించిన కనీసవేతనాలు ప్రావిడెంట్‌ఫండ్, మున్నగు సౌకర్యాలు లభిస్తున్నాయని చెప్పారు.

రాష్ట్రప్రభుత్వం, ఋణాలు గ్రాంట్లు ఇవ్వటంగానీ, మార్కెటింగు సౌకర్యాలు కల్పించటం గానీ జరుగలేదనీ, రేజ పోగా, వీవింగ్ షెడ్ నిర్మాణానికి గాను ఇచ్చిన లక్ష రూపాయల ఋణాన్ని తిరిగి తీసుకొనటం జరిగిందని ఆయన అన్నారు.

బలహీనవర్గాలకు సంబంధించివున్న పథకం క్రింద నేతపనివారికి గృహవసతి కాలనీని నిర్మించవలసిందిగా శ్రీ కొండాలక్ష్మణ్‌బాపూజీ తమ అధ్యక్ష ఉపన్యాసంలో, ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

చేనేత పనివారి అపెక్స్ సంఘానికి, ఫ్యాక్టరీలు గోదాములు, గోడవున్స్ నిర్మించుకునే నిమిత్తం సబ్సిడీ, ఋణాలు యివ్వవలసిందిగా, ఆంధ్రప్రదేశ్ నేత పనివారి సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ ప్రగడ కోటయ్య ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

వ్యవసాయ ఉత్పత్తి దార్ల సంఘానికి, గోడవున్‌లకు గాను 50 శాతం సబ్సిడీ, 50 శాతం ఋణం యివ్వబడుతున్నదని యీ సందర్భంలో ఆయన పేర్కొన్నారు.

శ్రీ పండిత శివలింగం, హైకోర్ట్ ఉపాధ్యక్షులు వందన సమర్పణ చేశారు.

## సమ్మె విరమించాలి: అధ్యాపకులకి శ్రీ బుల్లయ్య విజ్ఞప్తి

విశాఖపట్నం, జూలై 15 : విద్యాసంవత్సరం వృధా కానీయకుండా, యూనివర్సిటీ అధికారులతో సహకరించి సమ్మె విరమణకు పిలుపునిచ్చి పరీక్షలు యథామామూలుగా జరిగేట్లుగా తోడ్పడి, ఆ విధంగా విద్యార్థులైన యువతీ యువకులకు మనస్సు సంక్షోభమును నివారించాలని ఆంధ్ర యూనివర్సిటీ వైస్–ఛాన్సలర్ శ్రీ ఎల్. బుల్లయ్య అనుబంధ కళాశాలల అధ్యాపకులకు విజ్ఞప్తి చేశారు

అధ్యాపకుల న్యాయ సమ్మతమైన కోర్కెలను తీర్చటానికి, ఇబ్బందులను తొలగించటానికి ప్రభుత్వం తగు ఉపాయాలను కనుగొన గలదని తాము ఆశిస్తున్నామనీ కూడా శ్రీ బుల్లయ్య పేర్కొన్నారు. పరీక్షలకు గట్టిగా శ్రమపడి సిద్ధం అయిన అభ్యర్థులకి మళ్ళీ పరీక్షలకి వెళ్ళాలంటే ఎంతకష్టమో వేరే చెప్పనవసరం లేదని ఆయన పేర్కొన్నారు. మెట్రిక్, ప్రీయూనివర్సిటీ పరీక్షలు జూలై 23కి వాయిదా పడినవి. (స్వ.వి.)

## శ్రీ బి. ఆర్. కె. శాస్త్రి సూచన

# వైద్య సదుపాయాల కంటే వ్యాధి నివారణ చర్యలు ముఖ్యం

కాకినాడ, జూలై 15 : దేశం తీవ్ర ఆర్థిక క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొంటున్నదనీ, నిధుల కొరతవలన వైద్యరంగంలో అభివృద్ధి ఎక్కువగా ఆలస్యం అవుతున్నదనీ దేశంలో వైద్య సదుపాయాలకంటే కూడా రోగనిరోధక చర్యలు ఎక్కువ అవసరం అనీ, ప్రస్తుత పరిస్థితులలో డాక్టర్లను ఎక్కువగా తయారుచేస్తే, నిరుద్యోగాన్ని ఎక్కువ చేసినట్లే అవుతుందనీ, డబ్బు కొరతగా వున్నది కనుక పరోక్ష పన్నులు మొదలైన కొత్త పద్ధతులద్వారా నిధులను సమకూర్చుకొనే విషయం ఆలోచించవలసి వుందనీ, కుటుంబ నియంత్రణ గురించి కంటే, వున్న పిల్లల సంక్షేమంకోసం ఎక్కువ ఆలోచించటం అవసరమనీ, నేటి ఉదయం ఇక్కడ ఇండియన్ మెడికల్ అసోసియేషన్ ఆంధ్రప్రదేశ్‌శాఖ 14 వ వార్షిక సమావేశానికి ప్రారంభోత్సవంచేస్తూ ఆరోగ్యం, మునిసిపల్ పరిపాలనశాఖ ప్రత్యేకకార్యదర్శి శ్రీ బి. ఆర్. కె. శాస్త్రి, ఉద్ఘాటించారు. రంగరాయ మెడికల్ కాలేజి ఆడిటోరియంలో యీ సమావేశం జరిగింది. పిల్లలలో కనబడే పౌష్టికాహారలోపం, నివారణకు ప్రాధాన్యత ఇవ్వాలనీ, నిరుద్యోగులైన డాక్టర్లు స్వయంగా ఉపాధి కల్పన చేసుకొనేట్లు ప్రోత్సాహం ఇవ్వాలనీ, ఆయన సూచించారు.

రంగరాయ మెడికల్ కాలేజి ప్రిన్సిపల్, డాక్టర్ డి. సుందర శివరావు, (ఆహ్వాన సంఘం అధ్యక్షులు) ప్రతినిధులకి స్వాగతం చెప్పారు.

రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి ప్రధాని శ్రీమతి గాంధి, గవర్నరు ఖండూభాయ్ దేశాయ్, గవర్నరు సలహాదార్లు శ్రీ సరీన్, శ్రీ వి. కె. రావు, డాక్టర్ కె. ఎన్. రావు ప్రభృతులు పంపిన సందేశాలని, ఆర్గనైజింగ్ కార్యదర్శి డాక్టరు పి. ఎస్. మూర్తి చదివి వినిపించారు.

ఇండియన్ మెడికల్ అసోసియేషన్ ఆంధ్రప్రదేశ్ శాఖ అధ్యక్షులుగా పదవీ విరమణ చేస్తున్న డాక్టర్ జె. వి. ఆర్. శర్మ కొత్త అధ్యక్షులు డాక్టరు ఎస్. ఎల్. శాస్త్రికి, అధ్యక్ష బాధ్యతలను అప్పగిస్తూ, ఈ సంఘానికి పరిపాలన నిర్వహణ అధికారులు సహాయం, సానుభూతి నిరినిగా అందించారనీ, మంచి అవగాహన చూపారని పేర్కొన్నారు.

తమ వృత్తికి తగిన విధంగా, సంఘసేవను, దైనందిన వ్యాపారంలో భాగంగా నిర్వహించాలని, తమ అధ్యక్ష ప్రసంగంలో కొత్త అధ్యక్షుడు, డాక్టర్ ఎస్. ఎల్. శాస్త్రి సభ్యులకు విజ్ఞప్తి చేశారు. మాతృ సంస్థలు ఇతోధిక ఆసక్తిని కనపరచాలని కోరారు.

రాష్ట్రంలో ఇటీవల ఆందోళనలో అసువులు బాసిన అమర యువకుల స్మృతికి గౌరవంగా అధ్యక్షుని కోరికపై సభ్యులు లేచి ఒక నిమిషం మౌనం పాటించారు.

కాకినాడ జనరల్ ఆస్పత్రి సూపరింటెండెంట్—డాక్టర్ శ్రీమతి సి. వి. రమణి, సూవెనీర్‌ని ఆవిష్కరించారు.

వైజ్ఞానిక సమావేశానికి సైంటిఫిక్ సెషన్ వైద్య ఆరోగ్య సర్వీసుల అదనపు డైరెక్టరు డాక్టర్ డి. రామచంద్రరావు, ప్రారంభోత్సవం చేశారు.

స్వర్గీయ డాక్టర్ ఎల్లా ప్రగడ సుబ్బారావు గారి జీవిత విశేషాలని లేబరేటరీస్‌కి చెందిన శ్రీ మణి సంగ్రహంగా తెలియచేస్తూ ప్రసంగించారు.

గుండెజబ్బు చికిత్స గురించి, డాక్టర్ వి. కె. నాయక్ సుబ్బారావు స్మారకోపన్యాసం

# మహాసముద్రాల ఉష్ణోగ్రతతో విద్యుదుత్పత్తి చేసే యంత్రం

న్యూఢిల్లీ, జూలై 15 : మహాసముద్రాలపై ప్రసరించిన సూర్యుని ఉష్ణశక్తిని గ్రహించి, దానిని విద్యుచ్ఛక్తిగా మార్చే విద్యుదుత్పాదక యంత్రాలు త్వరలో రానున్నవని శాస్త్రవేత్తలు చెబుతున్నారు.

మహాసముద్రం ఉపరితలంలోని నీటికి, సముద్రగర్భంలోని చల్లని నీటికి ఉష్ణోగ్రతలో ఉండే వ్యత్యాసాన్ని విద్యుదుత్పాదనకు వినియోగించుకోవచ్చునని వారు అంటున్నారు.

యంత్రం ఈ ఉష్ణోగ్రతల వ్యత్యాసాన్ని వినియోగించుకుని ముందు కొంత విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది. ఆ విద్యుచ్ఛక్తిని ఉపయోగించి నీటిని ఉదజని, ప్రాణవాయువులుగా విడదీస్తుంది. అనంతరం ఆ వాయువులను పంపుల ద్వారా సముద్రపు టొడ్డుకు పంపుతారు. అక్కడ ఈ వాయువులను వినియోగించి మళ్ళీ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేస్తారు.

అమెరికా తీరానికి బహామాస్‌కు మధ్య గల గల్ఫ్‌స్ట్రీమ్ నుంచి 400 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసేందుకు ఇలాంటి విద్యుదుత్పాదక యంత్రాన్ని ఒకటి డిజైన్ చేస్తున్నారు.

ఉష్ణోగ్రతల వ్యత్యాసం హెచ్చుగా వుండే ఉష్ణమండల దేశాలకు—ఆ ప్రాంతాలలో గేజ్ ఉంటుంది.—ఇలాంటి విద్యుదుత్పాదక యంత్రాలు చాలా అనుకూలంగా ఉండగలవని భావిస్తున్నారు.

వ్యత్యాసం అట్టే ఉండక పోయినప్పటికీ, ప్రపంచ వ్యాప్తంగా ఇప్పుడు వినియోగించుకొనబడుతున్న దానికంటే ఎక్కువ విద్యుచ్ఛక్తిని మహాసముద్రాల నుంచి ఉత్పత్తి చేయడం సాంకేతికంగా సాధ్యమేనని కూడా శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

— — — :o:— — —

## 38 లక్షల టన్నుల చెరకు ఉత్పత్తి

న్యూఢిల్లీ, జూలై 15: మన దేశంలో 1971—72 లో 31.1 లక్షల టన్నుల చెరకు ఉత్పత్తి కాగా 1972—73 లో 38.7 లక్షల టన్నులు ఉత్పత్తి కాగలదని ప్రస్తుత అంచనాలను బట్టి అంచనా వేస్తున్నారు.

ఇప్పటికి 37.9 లక్షల టన్నుల ఉత్పత్తి వచ్చిందని మొత్తంగా ఉత్తర ప్రదేశ్‌లో 5.8 లక్షల టన్నుల మేరకు ఉత్పత్తి పెరగడం ప్రధాన కారణమని పేర్కొనబడింది. సహకార రంగంలో 14.29 లక్షల టన్నుల చెరకు

# రాజధానిలో ఒకేరోజున అయిదు రోడ్డు ప్రమాదాలు

(ఆంధ్రపత్రిక ప్రత్యేక విలేఖరి)

హైదరాబాద్, జూలై 15 : రాజధాని నగరంలో మొన్న జరిగిన పెక్కు రోడ్డు ప్రమాదాలలో ఒక వ్యక్తి మరణించాడు. కనీసం 16 మంది గాయపడ్డారు. పోలీసులు ఈ సందర్భంగా ముగ్గురిని నిర్బంధంలోకి తీసుకున్నారు.

పాతబస్తీలోని హుమయూన్ నగర్ వద్ద స్కూటర్ ప్రమాదంలో ఇంజనీరింగ్ కళాశాలకు చెందిన ప్రొఫెసర్ ఆలీముద్దీన్‌సిద్దిఖీ (వయస్సు 35 సంవత్సరాలు) మరణించారు.

హిమయత్‌నగర్‌లో ఒక ప్రొఫెసర్ నడుపుతున్న కారు సైకిల్ మీద వెడుతున్న ఇద్దరిని ఢీకొని రిక్షాలు, స్కూటర్లను ఢీకొన్నారు. అందులో ఒకరికి బలమయిన గాయాలు తగిలాయి. ఆ ప్రొఫెసర్ సారా నిషాలో వున్నట్లు చెప్పబడుతోంది.

దిల్‌కుష్‌నగర్‌లో ఆర్. టి. సి. బస్సు మరో బస్సును ఢీ కొనడంతో ఒక స్త్రీ సహా ఆర్గురు గాయపడ్డారు.

సికింద్రాబాద్‌లో కర్బాలా మైదానంవద్ద ఒక కారు బండిని ఢీ కొనడంలో బండితోలే వ్యక్తి గాయపడ్డారు.

బషీర్‌బాగ్ సమీపంలో ఒకకారు ఒక టాక్సీని మొన్న రాత్రి ఢీ కొనడంతో నలుగురు గాయపడ్డారు.

పోలీసు అసిస్టెంట్ కమీషనర్ (ట్రాఫిక్) శ్రీ ఎ. పి. రామయ్య పర్యవేక్షణలో ఇన్‌స్పెక్టర్ శ్రీ పి. వి. కిష్టంరాజు ఈ కేసు

# 342 మంది వ్యవసాయ పట్టభద్రులకు రూ. 13.58 లక్షలతో ఉపాధి కల్పన

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, జూలై 15: రాష్ట్రంలోని నిరుద్యోగులయిన 342 మంది వ్యవసాయ పట్టభద్రులకు ఉపాధి కల్పించడానికి నాలుగు పథకాలను ప్రవేశపెట్టవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వం వ్యవసాయ శాఖ డైరెక్టరేట్‌కు ఉత్తర్వులు జారీ చేసింది.

ఈ పథకాల క్రింద ఎంపిక చేయబడిన అభ్యర్థులకు శిక్షణకాలంలో ఏడాది పాటు నెలకు తలా 300 రూపాయలు స్టయిఫెండ్ ఇస్తారు.

అధికారప్రతినిధి ఈ విషయాన్నిపత్రికల వారికి తెలియజేస్తూ, ఈ పథకాలకు 13.58 లక్షల రూపాయల ఖర్చు కాగలదన్నారు. 1973-74 లో రాష్ట్రంలో నిరుద్యోగులయిన విద్యావంతులైనకు ఉపాధి కల్పించడానికి ఉద్దేశించిన స్వయం ఉపాధి పథకం క్రింద కేంద్ర ప్రభుత్వం కేటాయించిన ఆరు కోట్ల రూపాయల నుంచి ఈ 13.58 లక్షల రూపాయలను మంజూరు చేస్తారు.

స్వయం ఉపాధి పథకం క్రింద 100 మంది వ్యవసాయ పట్టభద్రులను విత్తనోత్పత్తి కార్యక్రమం, క్షేత్ర విషయాల

అధికార ప్రతినిధి చెప్పారు. విత్తనోత్పత్తి కార్యక్రమం క్రింద హైదరాబాద్‌లోని సస్యరక్షణ భూసార పరిరక్షణ శిక్షణ కేంద్రములో ఆరు నెలల పాటు విత్తనోత్పత్తి క్షేత్రంలో ఆరు నెలల పాటు, శిక్షణ ఇస్తారని ఆయన అన్నారు.

శిక్షణ అనంతరం ఈ పట్టభద్రులు తమ సొంత పొలాలలోగాని, కౌలుకు తీసుకొన్న పొలాలలో గాని విత్తనోత్పత్తి కార్యక్రమాన్ని ప్రారంభించగలరని ఆశించబడుతోందని ఆ ప్రతినిధి చెప్పారు. వీరికి ఏదయినా సహాయం కావలసివస్తే రాష్ట్ర వ్యవసాయశాఖ అందజేస్తుందని ఆయన తెలిపారు.

క్షేత్ర వ్యవహారాల సలహా కార్యక్రమం విషయంలో 100 మంది పట్టభద్రులకు భూసార పరిశీలన, ఎరువుల పరిశీలన, పంట వేసే పద్ధతి, సస్యరక్షణ మొదలయినవాటిలో శిక్షణ ఇస్తారని ఆయన చెప్పారు.

ఈ శిక్షణ పొందిన వారు గ్రామాలలో తమ సొంత కేంద్రాలు ఏర్పాటు చేసుకొనే నెలకు 100 రూపాయల వరకు సంపాదించడానికి వీలవుతుందని ఆయన అన్నారు. వీరిని అధికారం పొందిన క్షేత్ర వ్యవహారాల సలహాదారులుగా ప్రభుత్వం గుర్తిస్తుంది.

ధాలను కోటా ఇవ్వడానికి ఏర్పాట్లు చేస్తుంది. ఎరువులు, క్రిమి సంహారక ఔషధాల వ్యాపారానికి వీరికి లైసెన్సులు ఇస్తుంది. భవిష్యత్తులో నిరుద్యోగులయిన పట్టభద్రులే ఈ వ్యాపారం చేయాలన్నది ప్రభుత్వ ఉద్దేశం.

సస్యరక్షణ సేవా పథకం క్రింద 100 మంది నిరుద్యోగ పట్టభద్రులను వ్యవసాయ శాఖ ఆధ్వర్యంలో శిక్షణ ఇస్తారు.

# ప్రధాని ప్రజా వ్యతిరేక విధానాలు: డి. ఎమ్. కె. మహాసభ ఖండన

విల్లుపురం, జూలై 15 : అధిక సంఖ్యాక సభ్యుల మద్దతు గల పార్టీలు వున్నప్పటికీ కొన్ని రాష్ట్రాలలో ప్రజా ప్రభుత్వాలు ఏర్పాటు కాకుండా, రాజకీయ కారణాలతో రాష్ట్రపతి పాలనను కేంద్రం విధించినదని, ఈ చర్యలు ప్రజాస్వామ్యానికి వ్యతిరేకమని డి. ఎమ్. కె. మహాసభ నేడు ఖండించింది.

ఈ మహాసభ వివిధ అంశాలపై 30 తీర్మానాలు చేసింది.

తమిళనాడు ప్రభుత్వం ప్రవేశ పెట్టిన ద్విభాషా సూత్రాన్ని వోడించేందుకు కేంద్రం హిందీని బలవంతంగా రుద్దడానికి ప్రయత్నించడాన్ని ఈ మహాసభ ఖండించింది.

రాష్ట్ర స్వయం నిర్ణయాధికారం కోసం బలమైన ఉద్యమం ప్రారంభించాలని కోర బడింది. ఈ విషయంలో ఇందిరాగాంధి వోటమి తథ్యమని శ్రీ దురై మురుగన్ అన్నారు.

నిరుద్యోగ సమస్య పరిష్కారానికి చర్యలు తీసుకొనక పోతే దారుణమైన విప్లవం వస్తుందని, ఇతర రాష్ట్రాలలోని రాజకీయ నాయకులు రాజకీయ అస్థిరతకే తోడ్పడుతూ కాలాన్ని వృధాచేస్తున్నారని, ధరలు, నిరుద్యోగ సమస్యలు పట్టించుకోవడం లేదని ఆయన అన్నారు.

పార్టీ ద్రోహుల పథకాలను ఎదుర్కొనాలని, స్వయం నిర్ణయ హక్కును సాధించా లన్న డి. ఎమ్. కె. లక్ష్యాన్ని సాధించడానికి ఏలాంటి త్యాగాలకైనా సభ్యులు వెనుదీయ రని, కరుణానిధి నాయకత్వంలో తనకు పూర్తి విశ్వాసం కలదని శ్రీ రామనాథన్ (ఎస్. ఎల్. సి.) అన్నారు. అన్నా డి. ఎం. కె నుండి తిరిగి డి. ఎమ్. కె.లోకి అనేక మంది రానున్నారని శ్రీ శివగోపాల్ తెలిపారు.

తన పార్టీకి మద్దతు ఇవ్వవలసిందిగా ఢిల్లీవెళ్ళి ప్రధానమంత్రిని కోరిన ఎమ్. జి. రామచంద్రన్, వికటపుల కార్పొరేషన్‌కు చెందిన పెద్ద కుంభకోణం ఇందిరాగాంధి ప్రభుత్వంలోనే జరిగిన విషయాన్ని మరచి పోయారని శ్రీ వీరాస్వామి అన్నారు.

---

## శ్రీ కామరాజ్ జన్మదినోత్సవం
### ప్రధాని శుభాకాంక్షలు

మద్రాసు, జూలై 15: సంస్థా కాంగ్రెస్ నాయకుడు శ్రీ కె. కామరాజు నేడు 71వ జన్మదినోత్సవం జరుపుకున్నారు. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ఆయనకు శుభాకాంక్షలు తెలియజేశారు. రాష్ట్ర గవర్నరు శ్రీ కె. కె. షా, కేంద్ర మంత్రి శ్రీ టి. ఎ. పాయ్, శ్రీ భక్తవత్సలం, శ్రీ ఎస్. కె. పాటిల్, శ్రీ అతుల్యఘోష్ ప్రభృతులు కూడా శుభాకాంక్షలు పంపారు.

నగరంలో ఆలయాలలో ప్రత్యేక పూజలు జరిగాయి. పూజారులు శ్రీ కామరాజు ఇంటికి ప్రసాదం తీసుకు వెళ్లి బహూకరించారు. త్యాగరాయనగర్‌లోని ఆయన గృహానికి వచ్చిన వారిలో పెక్కు మంది కాంగ్రెస్ సేవాదళ వలంటీర్లు వున్నారు. వెయ్యిమంది స్కూలు పిల్లలకు శ్రీ కామరాజు పండ్లు, పుస్తకాలు, పెన్సిళ్లు పంచి పెట్టారు.

---

## అభివృద్ధి కార్యక్రమాలలో విద్యార్థుల పాత్ర
### తూర్పుగోదావరి కలెక్టర్ వివరణ

రాజమండ్రి, జూలై 15 : తనకు అనువైన గ్రామాన్ని ఎన్నుకొని సత్వర ప్రగతికి అక్కడ అభివృద్ధి కార్యక్రమాలు అమలు పరచవలసిందిగా తూర్పు గోదావరి జిల్లా కలెక్టరు శ్రీ ముబారక్ హైదర్ రజా కోరు కొంటారో విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగిస్తూ చెప్పారు. ఈ కార్యక్రమాలు జరపాలని కోరారు. గ్రామ సేవా కార్యక్రమాలకు సంబంధించిన యువజనుల శిబిరాన్ని కలెక్టరు సందర్శించారు. ప్రభుత్వ కళాశాల విద్యార్థులు, ఆంధ్రకేసరి యువజన సమితి వారు ఈ శిబిరం నిర్వహిస్తున్నారు. కొంకొండ శివారు కుంచెపల్లె హరిజనవాడ మధ్య కొత్త రోడ్డు నిర్మాణ పనిని ఈ శిబిరం ఎంచుకున్నారు. 62 మంది విద్యార్థులు ఉన్నారు. 25 మంది ఇతరులు ఉన్నారు. వచ్చే వేసవిలో ఇలాంటి శిబిరాలు మరిన్ని నిర్వహించాలని అభిలాష కలెక్టరు వ్యక్తపరిచారు.

విద్యార్థులు ఉదయం నాలుగుగంటలు శ్రమదానం చేస్తున్నారని, సాయంత్రం గ్రామీణ ప్రాంతాల ఆర్థిక సాంఘిక పరిస్థితిని పరిశీలిస్తున్నారని శిబిరం అధ్యక్షులు శ్రీ వి. అర్జున్ చెప్పారు. కలెక్టరు వెంట సబ్ కలెక్టరు శ్రీ జి. నిరంజనరావు ఉన్నారు. వి. సి. ఒ. శ్రీ వి. పంచయ్య స్వాగతం చెప్పారు. (న్యూ. వి.)

---

## కేరళకు ఆహార ధాన్యాలు
## కేంద్రంపై విమర్శలు

కొచ్చిన్, జూలై 15: శ్రీ మహమ్మద్ ఇబ్రహీం సులేమాన్ సైత్ ఎం. పి., భారత ముస్లింలీగు అధ్యక్షుడు నేడొక ప్రకటన చేస్తూ కేంద్ర ప్రభుత్వం కేరళ పట్ల సవతితల్లి దృష్టిని మాన్పుకొని, రాష్ట్రంలో ఏర్పడిన తీవ్రమైన ఆహార సంక్షోభాన్ని నివారించడానికిగాను ఆహార ధాన్యాలను లభ్యమైన చోటనుంచి సేకరించి వెంటనే పంపాలని కోరారు.

మిరియాలు, అల్లం, జీడిపప్పు, కొబ్బరి పీచు, జలసంపదలను విరివిగా ఎగుమతి చేసి దేశానికి ఎంతో విదేశ ద్రవ్యాన్ని కేరళ సంపాదించి పెడుతున్నదని, మిగులు విద్యుత్‌ను, జలాలను పొరుగు రాష్ట్రాలకు అందుబాటు చేస్తున్నదని, కాని 50 శాతం ఆహార ధాన్యాల కొరతను అది అనుభవిస్తున్నదని, తాము ఏకాకిగా వుండి పోయామని కూడా ఆయన ఈ ప్రకటనలో వివరించారు.

కేరళ పార్లమెంటు సభ్యులందరూ ఏకమై కేంద్రాన్ని గట్టిగా ఒత్తిడిచేసి అవసరమైన ఆహారధాన్యాలను కేంద్రంనుంచి సంపాదించాలని కూడా విజ్ఞప్తి చేశారు.

### కేంద్రం బాధ్యత

కొచ్చిన్, జూలై 15 : కేరళలో 12 అవున్సుల రేషన్ ఇవ్వడానికి నెలకు 80 వేల టన్నుల బియ్యం. అంతకు సమాన మొత్తంలో గోధుమలను కేంద్ర ప్రభుత్వం తక్షణం ఆహార సంస్థల ద్వారా ... ద్వారా సమకూర్చవలసి వుంటుందని రాష్ట్ర ఆహారమంత్రి శ్రీ పాల్ పి. మణి నేడిక్కడ విలేకరులకు చెప్పారు.

ఆంధ్రప్రదేశ్, మైసూరు, కేరళ, తమిళనాడులతో కూడిన దక్షిణ బియ్యపు మండలాన్ని రద్దుచేసే సందర్భంలో ఈ కోటా మేరకు ధాన్యాల సప్లయికి కేంద్రం అంగీకరించిందని, అవసరంలోనే ఏభై శాతం ఆహార ధాన్యాల కొరత వున్న కేరళ రాష్ట్రంపట్ల బద్ధమైన రేషనింగ్ అమలుకుగాను 213 లక్షల జనాభాలో 203 లక్షల మందికి రేషన్ కార్డులను పంచిపెట్టడం జరిగిం దన్నారు.

### ఐరోపాలో భారత దుస్తులపై దిగుమతి సుంకం

బ్రసెల్సు, జూలై 15 : భారత్ నుంచి, ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాల నుంచి దిగుమతయ్యే పత్తి నూలులో తయారైన బనియనులు, డ్రాయర్లపై 17 శాతం దిగుమతి సుంకాన్ని ఐరోపా ఉమ్మడి మార్కెట్ కమీషన్ నేడు విధించింది. వీటి దిగుమతికి ఈ ఏడాదికి ఇచ్చిన కోటా పూర్తి కావడంతో ఈ సుంకం విధింపు జరిగినట్లు తెలుస్తున్నది.

---

## అధిష్ఠానవర్గం పిలుపు: డి.పి. మిశ్రా తిరస్కృతి
(1 వ పేజీ తరువాయి)

ఆ సమ్మతి వర్గంవారికి తెల్పినట్లు తెలియ వచ్చింది.

ఇది ఇలా వుండగా గవర్నర్ శ్రీ ఎస్. ఎన్. సిన్హా రాష్ట్రంలో రాజకీయ పరిస్థితిని ఎప్పటికప్పుడు ప్రధానమంత్రికి, ఇతర కేంద్ర నాయకులకు తెల్పుతున్నారు.

మాజీ ముఖ్యమంత్రి శ్రీ శ్యామ్‌చరణ్ శుక్లా నేడు న్యూఢిల్లీనుంచి రాయపూర్ వెడుతూ భోపాల్‌లో కొన్ని గంటలు ఆగారు.

రాష్ట్రంలో కొత్తగా ఏర్పడిన రాజకీయ పరిణామాలను గూర్చి ప్రధాన మంత్రితో మొన్న తాము జరిపిన చర్చలను గూర్చి ఏలాంటి వివరాలు తెల్పడానికి ఆయన నిరాకరించారు.

శ్రీ శుక్లా చాలామంది ఇక్కడ శాసన సభ్యులతో సర్క్యూట్ హౌస్‌లోని తమ గదిలో గడిపారు. పలువురు కాంగ్రెసు శాసన సభ్యులు ఆయ ను కలుసుకున్నారు.

---

## అమెరికన్ గుమ్‌ తి భావాకలాపం నృత్యం
అంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాదు, జూలై 15 : అమెరికాకు చెందిన మిస్ రెక్సోనా ఫూర్ మైన్ భామాకలాపం, దేవదాసి నృత్యాలలో ప్రావీణ్యం సంపాదించిన సందర్భంలో ఆమె నృత్య కార్యక్రమాన్ని ఈ నెల 16న రవీంద్రభారతిలో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, నృత్యనికేతన్ వారు సంయుక్తంగా ఏర్పాటు చేశారు. కార్యక్రమానికి కేంద్ర కార్మిక ఉపమంత్రి శ్రీ వెంకటస్వామి అధ్యక్షత వహిస్తారు.

---

## బ్రహ్మానందరెడ్డి వెల్లడి
(1 వ పేజీ తరువాయి)

వెంగళరెడ్డి ప్రభృతులు కలుసుకున్నారు.

## చర్చలపై కృష్ణమూర్తి నాయుడు వివరణ

హైదరాబాద్, జూలై 15 : ఆంధ్ర ప్రజలు కోరుతున్న ప్రకారం ఆంధ్రప్రాంతానికి ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు కావడమే ప్రజల అభిమతమని శ్రీ బ్రహ్మానందరెడ్డికి మేము చెప్పాము. కేంద్ర ప్రభుత్వం ప్రత్యామ్నాయంగా ఏదైనా ప్రతిపాదనలు చేస్తే తమ కార్యవర్గం ఇదివరకు తీర్మానించినట్లు సమితి సర్వసభ్య సమావేశం దగ్గరఉంచి వారి నిర్ణయానికి బద్ధులము కాగలమని చెప్పాము'' అని ఆంధ్రకాంగ్రెసు కార్యాచరణ సమితి కార్యదర్శి శ్రీ ఖాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడు శ్రీశైలం నుంచి తిరిగి వచ్చాక విజయనగర్ కాలనీలోని భవనంలో పత్రికా ప్రతినిధులకు తెలియ జేశారు.

శ్రీ కృష్ణమూర్తినాయుడు, శ్రీ బసిరెడ్డి, శ్రీ మూర్తిరాజు, శ్రీ బ్రహ్మానందరెడ్డితో శ్రీ బి. వి. సుబ్బారెడ్డి తరపున చర్చలలో పాల్గొని ఇవ్వాళ రాత్రి శ్రీశైలం నుంచి హైదరాబాద్ వచ్చారు. శ్రీశైలంలో జరిగిన సమావేశ పరిస్థితులను గురించి శ్రీ కృష్ణమూర్తినాయుడు ఇలా చెప్పారు.

''శ్రీ బ్రహ్మానందరెడ్డి, శ్రీసుబ్బారెడ్డిగారితో మాట్లాడాలని అనుకున్నారు. మధ్యవర్తులం వచ్చినందువల్ల ఇంత దూరం ప్రయాణం చేసుకేనని శ్రీ సుబ్బారెడ్డి అన్నారు. అయితే తాను 14న లేదిన శ్రీశైలం వస్తామని అక్కడకు సుబ్బారెడ్డి రాగలరేమో కను క్కోమని శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు అన్నారు. శ్రీశైలం అయితే ఫరవాలేదనీ, ఎలాగో వస్తానని శ్రీ సుబ్బారెడ్డి అన్నారు. మమ్మల్ని కూడా శ్రీశైలం రమ్మని శ్రీ సుబ్బారెడ్డియే కోరారు. వారి కోరిక మీదట మేము అక్కడికి వెళ్లాము. ప్రతిష్టంభన పరిష్కారానికి మా అభి ప్రాయాలు బ్రహ్మానందరెడ్డి అడి గారు. మేము అరమరిక లేకుండా చెప్పాము.

''17వ తేదీన విశాఖపట్నంలో శ్రీకాకుళం, విశాఖ జిల్లాల ప్రతినిధులు సమా వేశమవుతున్నారు. దానికి మేము వెళు తున్నాము. మా అధ్యక్షులు పిల్చితే రావ డానికి యత్నం చేస్తామని, తప్పితే జూలై 20న కాకినాడలో జరిగే ప్రజాప్రతినిధుల సభకు వస్తామని అన్నారు. శ్రీ బ్రహ్మానంద రెడ్డి వెళ్లే లోపలే మళ్ళీ ఒకసారి మేము కలుసుకోవాలి.''

---

రాజేంద్రనగర్ వ్యవసాయ కళాశాలలో

## లైవ్‌స్టాక్ ఇన్‌స్పెక్టర్లకు సంక్షిప్త బి. వి. ఎస్‌సి. కోర్సు

(అంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, జూలై 15 : వెటరినరీ లైవ్-స్టాక్ ఇన్‌స్పెక్టర్ల (వి. ఎల్. ఐ. ఎస్) కొరకు మూడు సంవత్సరాల సంక్షిప్త బి. వి. ఎస్. సి., డిగ్రీకోర్సుకి నిన్న ఇక్కడ రాజేంద్రనగర్‌లోని వ్యవసాయ కళాశాలలో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం (ఎ. పి. ఎ. యు.) ఉపాధ్యక్షులు శ్రీ ఎం. ఆర్. పాయ్, ఐ. ఏ. ఎస్., ప్రారంభోత్సవం చేశారు.

వెటరినరీ సైన్సు శాఖ డీన్ డాక్టర్ జి. వెంకటరత్నం అధ్యక్షత వహించారు.

రాష్ట్ర పశు సంవర్థక శాఖ డైరెక్టర్ డాక్టర్ బి. ఎ. షిరాజీ ముఖ్య అతిథిగా విచ్చే శారు.

కళాశాలలో క్రమ శిక్షణతో కూడిన ఆదర్శవంతమైన నడవడి అనుసరించాలనీ, ఆ విధంగా ఇతర విద్యార్థులకే మార్గదర్శకత్వం కావాలనీ, తమ ప్రసంగంలో శ్రీ పాయ్ వి. ఎల్. ఐ. ఎస్.లకు విజ్ఞప్తి చేశారు.

వి. ఎల్. ఐ. ఎస్. లకు ప్రభుత్వం కొంత కాలం క్రిందట ఇచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చే బాధ్యతని ఎ. పి. ఎ. యు.కి ఇవ్వాలనీ, ఈ కోర్సు ఏర్పాటు వలన, వి. ఎల్. ఐ. ఎస్. లకు అవకాశాలు మెరుగుకాగలవని శ్రీ పాయ్ పేర్కొన్నారు. సభకు హాజరైనవారిలో పాలకమిషనర్ డాక్టర్. ఎ.సూర్యప్రకాశరావు, వివిధ విషయాలకు సంబంధించిన డైరెక్టర్ - డీన్‌లు, ప్రొఫెసర్లు స్పెషలిస్టులూ యూనివర్శిటీలోని డిపార్టుమెంటుల అధిపతులు వున్నారు.

బి. వి. పితాంబర్ మాట్లాడుతూ పేర్కొన్నారు.

వి. ఎల్. ఐ. ఎస్.లకి యీ మూడేళ్ళ కోర్సులో మొదటి సంవత్సరం, మధ్యలోని ప్రైవ సైన్సు విషయాల అధ్యయనం వుంటుందనీ, ఆ తరువాత రెండు సంవత్సరాలూ, రాజేంద్రనగర్‌లోని వెటరినరీ కళాశాలలో చదువ వలసి వుంటుందని, డాక్టర్ వి. ఎస్. సాల్కాండర్ వెటరినరీ సైన్సు కళాశాల ప్రిన్సిపాల్ మాట్లాడుతూ పేర్కొన్నారు.

వ్యవసాయ కళాశాల ప్రిన్సిపాల్, డాక్టర్ కె. ఎస్. సూర్యనారాయణ ప్రారంభంలో స్వాగతం చెప్పారు.

సంక్షిప్త కోర్సుకు సంబంధించిన విద్యార్థి శ్రీచెన్నయ్య వందన సమర్పణతో సభ ముగిసింది.

— — — :o:— —

## కోళ్ళ పెంపకంలో కరస్పాండెన్స్ కోర్సు

భారతీయ వ్యవసాయ పరిశోధనామండలి వారి తోడ్పాటుతో, కోళ్ళ పెంపకం విషయంలో, ఎ.పి.ఎ.యు, కరస్పాండెన్స్ కోర్సుని ఏర్పాటు చేయగలదని తమ అధ్యక్ష ప్రసంగంలో డాక్టర్ వెంకటరత్నం సూచించారు.

ఉత్సాహవంతులైన చిన్న లేదా పారిశ్రామిక వేత్తలకోసం కూడా త్వరలో వృత్తి సంబంధమైన కోర్సులు ప్రారంభం కాగల వని ఆయన చెప్పారు.

వి. ఎల్. ఐ. ఎస్. లకు సంబంధించిన సంక్షిప్తపు 3 సం. కోర్సు ఇప్పటి కంటే ముందు ముందు విస్తృతం చేయటం జరుగు తుందని కూడా ఆయన తెలియచేశారు.

ఈ కోర్సువలన వి. ఎల్. ఐ. ఎస్.ల వృత్తి విషయకమైన సామర్థ్యం బాగా పెంపొంద గలదని ముఖ్యఅతిథిగా విచ్చేసిన డాక్టర్

---

## భారత్‌తో కొత్త వాణిజ్య ఒప్పందాలు
### 3 ఆఫ్రికన్ దేశాల సమ్మతి

న్యూఢిల్లీ, జూలై 15: తూర్పు ఐరోపా దేశాలతో చేసుకున్న పద్ధతిలోనే భారత్‌తో కూడా వార్షిక వాణిజ్య ఒప్పందాలు కుదుర్చు కోడానికి టాంజానియా, జాంబియా, కెన్యాలు తమ సంసిద్ధత తెలిపాయి.

భారత వాణిజ్య శాఖ ఉపమంత్రి శ్రీ ఎ. సి. జార్జి ఈ మూడు ఆఫ్రికన్ దేశాలలో 15 రోజుల పాటు జరిపిన పర్యటనను ముగించుకుని నేడిక్కడకు తిరిగి వచ్చారు.

తాను చేసిన వాణిజ్య ఒప్పందం ప్రతిపాదన లను ఈ మూడు దేశాలు అంగీకరించినవని శ్రీ జార్జి పత్రికల వారితో చెప్పారు.

---

వచ్చే నెలలో జనసంఘం కార్యక్రమం

## సరసమైన ధరలకు ఆహార ధాన్యాల సప్లయ్‌కోసం ఆందోళన

ఢిల్లీ, జూలై 15 : ప్రజలకు ఆహార ధాన్యాలు, ఇతర నిత్యావసర సరుకులు సరసమైన ధరలకు తగినంతగా సరఫరా చేయాలని కోరుతూ జనసంఘం వచ్చేనెలలో పెద్దఎత్తున ఆందోళన ప్రారంభించగలదని పార్టీ ఆర్గనైజింగ్ కార్యదర్శి శ్రీ నానాజీ దేశ్‌ముఖ్ నేడు ఇక్కడ ప్రకటించారు.

ఈ ఆందోళన సందర్భంగా పట్టణాల లోనూ, పల్లెలలోనూ పూరేగింపులు శాంతియుత ప్రదర్శనలు జరుగుతాయనీ పట్టణాలలో ప్రదర్శకులు ప్రభుత్వ గిడ్డంగుల వద్దకు ఊరేగింపుగా వెళ్ళి, షాపుదుకాణాలకు తగినంత నిల్వలు తరలించవలసిందిగా కోరుతారనీ శ్రీ దేశముఖ్ పత్రికా విలేఖరుల గోష్ఠిలో చెప్పారు.

దేశంలో ఆహార ధాన్యాల సరఫరా పరిస్థితి ప్రత్యేకించి రానున్న రెండు మాసాలలో చాలా క్లిష్టంగా ఉండగలదని ఆయన తెల్పారు.

ఆహార ధాన్యాల సరఫరా విషయంలో ప్రస్తుతం ఎదుర్కొనవలసి వస్తున్న చిక్కులకు గత సంవత్సరం దుర్భిక్షం కొంత వరకు మాత్రమే కారణమనీ, అక్రమ నిల్వల నిరోధక చట్టాలను అమలు చేయడంలో ప్రభుత్వం నిర్లక్ష్యంగా ఉండటం లేదా విచక్షణ చూపడం ప్రస్తుత దుస్థితికి ప్రధాన కారణమనీ శ్రీ దేశముఖ్ అన్నారు. పెద్ద రైతులు కాంగ్రెసు పార్టీకి మద్దతుదారులు కాబట్టి, పెద్ద ఎత్తున ఆహార ధాన్యాలను అక్రమంగా నిల్వచేసేందుకు వారిని అనుమతి స్తున్నారనీ, అందువల్లనే బ్లాక్‌మార్కెట్‌లో కోరినంత పరిమాణంలో లభిస్తున్నాయనీ ఆయన ఆరోపించారు.

కొనడమే కారణమని ఆ తీర్మానం తెల్పింది. ప్రస్తుత అవ్యవస్థను అంతమొందించి, సరసమైన ధరలకు ఆహార ధాన్యాలను ప్రజలకు సరఫరా చేయాలని సూచించింది.

— — :o:— —

### ఇండొచైనాలో అమెరికన్ నిధుల వినియోగంపై ఆంక్షలు

వాషింగ్టన్, జూలై 15: ఇండోచైనాలో థాయ్‌లాండ్ వంటి మూడవ దేశం నిర్వహించే సైనిక కార్యకలాపాలకు అమెరికా నిధుల వినియోగాన్ని నిరోధించే తీర్మానాన్ని సెనేట్ విదేశ సంబంధాల సంఘం నిన్న ఆమోదించింది.

ఆగస్టు 15 నాటికి ఇండోచైనాలో సైనిక కార్యకలాపాలన్నింటికీ స్వస్తి చెప్పడానికి అమెరికన్ కాంగ్రెస్‌తో ప్రభుత్వం ఒప్పందానికి వచ్చినప్పటికీ సెనేట్ విదేశసంబంధాల సంఘం ఈ చర్య తీసుకుంటున్నది.

---

## ప్రభుత్వానికి హిందూ మహాసభ హెచ్చరిక

న్యూఢిల్లీ, జూలై 15 : బియ్యం టోకు వ్యాపారాన్ని స్వాధీనం చేసుకోవాలన్న నిర్ణయాన్ని ఒకటికి రెండుసార్లు పునఃపరిశీలించు కోవలసిందని అఖిలభారత హిందూమహాసభ ప్రభుత్వానికి హెచ్చరిక చేసింది.

హిందూమహాసభ కార్యవర్గం రెండు రోజులపాటు ఇక్కడ సమావేశమై ఆమోదించిన ఒక తీర్మానంలో ఈ హెచ్చరిక చేయబడింది. దేశంలో ఆహార ధాన్యాల సరఫరా పరిస్థితి క్షీణించి పోవడానికి ప్రభుత్వం

---

## రాతియుగం నాటి వర్ణచిత్రశాల

పూనా, జూలై 15: రాతియుగం నాటి మానవుడు కళారంగంలో సాధించిన విజయాలను అభివర్ణించే వర్ణచిత్రాల ప్రదర్శనశాల భోపాల్ సమీప గుహలలో బయల్పడింది.

భీమ్‌బెట్కా అనే ప్రదేశంలో గల ప్రకృతి సిద్ధమైన ఈ గుహలలో కనిపించిన వర్ణచిత్ర ప్రదర్శనశాల ప్రపంచంలో ఇలాంటి ప్రదర్శనశాలలలో కెల్లా పెద్దదని పురావస్తు పరిశోధకులు పేర్కొన్నారు.

భోపాల్‌కు 40 కిలోమీటర్ల దూరంలో కీకారణ్య మధ్య భాగంలో ఒక పెద్ద కొండపు పార్శ్వ భాగంలో ఈ లోయలు వున్నవి. ఇక్కడ మానవుడు వాడిన కొన్ని వస్తువుల చిహ్న రూపాలు లభించాయి. దీన్ని బట్టి రాతి యుగపు మానవుడు లక్ష సంవత్సరాల క్రితం ఈ ప్రాంతంలో నివసించి క్రమక్రమంగా అభివృద్ధి చేయబడినని పురావస్తు శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

త్రవ్వకాలు నిర్వహించిన వారిలో విక్రమ్ విశ్వవిద్యాలయానికి (ఉజ్జయిని) చెందిన వి. ఎస్. వకాంకర్, పూనా దక్కన్ కాలేజీకి చెందిన డాక్టర్ వి. ఎన్. మిశ్రా, స్విట్జర్లాండ్‌లోని ఫ్రెయిబర్గ్ యూనివర్శిటీకి చెందిన డాక్టర్ మిసెస్ ... వున్నారు.

ఇక్కడ పది చదరపు కిలో మీటర్ల పరిధిలో 600 గుహలు వ్యాపించివున్నవి. ఇవన్నీ రాతి గుట్టల క్రింద వున్నవి. వీటిలో 500 గుహలలో రాతి యుగపు మానవుడు ఎరుపు, తెలుపు, ఆకుపచ్చ రంగులతో వేసిన చిత్రాలు వున్నవి. జంతువుల చిత్రాలు, వేటను,

---

## లైబీరియన్‌లకు క్లిష్టస్థితి: శాసనమండలి సభ్యుల విజ్ఞప్తి

(అంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, జూలై 15 : రాష్ట్రంలో గ్రంథాలయాలు, లైబ్రేరియన్‌ల పరిస్థితి మెరుగుదలకు చర్యలు తీసుకోవాలని రాష్ట్ర గవర్నరు సలహాదారు శ్రీ పరీక్, విద్యాకార్యదర్శి శ్రీ రాజగోపాల్‌లకు శాసన మండలి సభ్యులు శ్రీ కె. కోటేశ్వరరావు, శ్రీ పి. రంగారావులు విజ్ఞప్తి చేశారు.

ఆంధ్రోద్యమం కారణంగా ఆంధ్రప్రాంతంలో సమ్మె చేయడం కారణంగా 1600 మంది లైబ్రేరియన్‌లు క్లిష్ట స్థితిలో వున్నారు. అని ఒక విడుదల పత్రంలో పేర్కొన్నారు. వెంటనే నిధులు విడుదలచేసి లైబ్రేరియన్‌లను రక్షించాలని వారు ఒక విడుదల పత్రంలో కోరారు.

— — — o:o — — —

## భద్రాచలం డివిజన్ గిరిజనులకు సహకార బ్యాంకు సహాయం

(అంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, జూలై 15 : 59 సహకార సర్వీసు సంఘాల ద్వారా యీ సంవత్సరం భద్రాచలం డివిజన్‌లో చిన్న రైతులకు కొండజాతి వారికి 26 లక్షలు, 24 లక్షలు కొండజాతులు వానికానికి సహాయంగా ఇచ్చినట్లు కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు మేనేజర్ శ్రీ జి. గంగారావు నిన్న విలేఖరులకు తెలిపారు.

1970లో 2600 మంది కొండజాతి వారు యీ బ్యాంకుతో సభ్యులుగా ఉండగా యీ నాడు వారిసంఖ్య 6250కి పెరిగిందని, ఆయన అన్నారు.

——o:o——

హైదరాబాదు, జూలై 15: కేంద్ర పారిశ్రామిక అభివృద్ధి శాఖ పార్లమెంటరీ సలహా సంఘ సమావేశం ఈ నెల 18 వ తేదీ ఉదయం 10.30 గంటలకు జూబిలీహాలులో జరుగుతుంది.

---

## కాలేజీ అధ్యాపకుల విజ్ఞప్తి
(1 వ పేజీ తరువాయి)

ప్రభుత్వం అధ్యాపకుల న్యాయమైన కోర్కెలు తీర్చేందుకు అయ్యే కొద్ది వ్యయానికి వెను కాడక అమూల్యమైన విద్యా సంవత్సరాన్ని కాపాడవలసిందిగాను, ఆ స్వల్ప మొత్తం ఇచ్చి నందువల్ల ప్రైవేటు కళాశాలల అధ్యాపకు లకు జరిగే న్యాయాన్ని గమనించవలసిందిగాను ప్రభుత్వానికి సారధ్య సంఘం విజ్ఞప్తి చేస్తున్నది.

అధ్యాపకులపట్ల ప్రభుత్వమువారు అవలంబిస్తున్న నిర్లక్ష్య వైఖరిని ఖండించి, ప్రభుత్వం తన విధానాలద్వారా పరిస్థితులనుమరింత విషమింపచేయవద్దని నచ్చచెప్పవలసిందిగాను సారధ్య సంఘం ప్రజలకు, విద్యార్థి లోకానికి విజ్ఞప్తి చేస్తున్నది.

---

## ఆంధ్రప్రదేశ్‌లో కేరళ కథాకళి బృందం పర్యటన

అంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాదు, జూలై 15 : ఆంధ్రప్రదేశ్, కేరళ రాష్ట్రాల సంగీత నాటక అకాడమీలు పరస్పరం సాంస్కృతిక బృందాలు పంపుకొనటానికి అంగీకరించారు. ఒక రాష్ట్ర సాంస్కృతిక విలువలు మరొక రాష్ట్ర ప్రజలకు తెలియచేయటానికి యీ ఏర్పాట్లు జరుపు తున్నారు.

ఈ కార్యక్రమం కింద మద్రాసులోని కళామండలం ఆర్ట్స్ అకాడమీ బృందాన్ని కేరళ పంపుతున్నారు. వీరు కేరళలో 5 కార్యక్రమాలలో పాల్గొంటారు. అలాగే కథాకళి నృత్యంలో ఆయుతు కార్యక్రమాలలో పాల్గొనటానికి కథాకళి బృందం ఆంధ్రప్రదేశ్‌లో పర్యటనలో పర్యటిస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లో జరిగే కేరళ బృందాల కార్యక్రమాలు : నెల్లూరులో జూలై 15న, విజయవాడలో జూలై 17, ఏలూరులో జూలై 18, హైదరాబాద్‌లో జూలై 20న, అనంతపూరులో జూలై 22న జరుగుతాయి.

ఆంధ్ర, కేరళ కళాకారుల గోష్ఠి కార్యక్రమం హైదరాబాద్‌లో జూలై 21న ఆకాశవాణి హాలులో జరుగుతుంది.

——o:o——

హైదరాబాదు, జూలై 15: కేంద్ర పారిశ్రామికాభివృద్ధి శాఖలో డిప్యూటీమంత్రి శ్రీ సియావుద్దీన్ బుఖారీ ఈ నెల 17 న భుజ నేశ్వర్‌నుంచి విమానం మీద హైదరాబాదు వస్తారు, మరునాడు ఇక్కడనుంచి బొంబాయి వెళతారు.

---

యు. పి. అసెంబ్లీ పార్టీ నాయకత్వం నుంచి

# త్రిపాఠిని తొలగించాలని 2 అసమ్మతి వర్గాల తీర్మానం

లక్నో, జులై 15 : యు. పి. కాంగ్రెస్ శాసనసభ పార్టీ నాయకత్వం నుంచి శ్రీ కమల పాటి త్రిపాఠిని తొలగించాలని పార్టీలోని రెండు ప్రధాన అసమ్మతి వర్గాలు కోరాయి. ఈ రెండింటిలో ఒక వర్గానికి శ్రీ సాలిగ్రామ్ జైస్వాల్, మరో వర్గానికి డాక్టర్ రాజేంద్ర కుమార్ బాజపాయ్ నాయకులు.

ఈ రెండు వర్గాల మధ్య ఇదివరలో విభేదాలు ఉండేవి కాని పార్లమెంటు సభ్యులు శ్రీ ఎ. డి. ఖైన్, శ్రీ త్రిలోకిసింగ్ ఈ రెండు వర్గాలను మొన్న కలిపారు.

ఈ రెండు వర్గాల సమిష్టి సమావేశం నిన్న జరిగింది. కాని డాక్టర్ బాజపాయ్ అస్వస్థతవల్ల సమావేశానికి హాజరు కాలేకపోయారు. కాని ఆమె మద్దతుదార్లు సమావేశంలో పాల్గొన్నారు. ఈ సమావేశంలో 39 మంది పార్టీ సభ్యులు పాల్గొన్నారు.

త్రిపాఠి పూర్వమంత్రివర్గంలోని కొందరు మంత్రులు కూడా ఈ సమావేశంలో పాల్గొన్నారు. అయితే ఇలా జరగడం ఇదే ప్రథమం. వీరు సహాయ మంత్రులు శ్రీ శ్యామసూరత్ ఉపాధ్యాయ, శ్రీ రామ్‌పుష్పన్ పటేల్.

సమావేశానికి హాజరైన శాసన సభ్యులలో 21 మంది పూర్వపు బి. ఏ. డి కి గాని, సంయుక్త సోషలిస్టు పార్టీకి గాని చెందినవారు.

## ఢిల్లీకి త్రిపాఠి ప్రయాణం

అసమ్మతి వర్గాల తీర్మానంపట్ల యు.పి. మాజీ ముఖ్యమంత్రి శ్రీ కమలపాటి త్రిపాఠి తీవ్రమైన అభ్యంతరం చెప్పారు. ఆ వర్గాల వారు ఇక్కడ సమావేశం జరపడంకాక తమ కోర్కెను ప్రధాన మంత్రి ముందు పెట్టాలని ఆయన అన్నారు.

శ్రీ త్రిపాఠి పత్రికల వారితో మాట్లాడుతూ, నాయకత్వంలో మార్పు కావాలను కుంటే ప్రధాని ఆమోదంతో యిది చేసుకో వచ్చునన్నారు.

అసమ్మతి వర్గం బలంపై ఆయన వ్యాఖ్యానించడానికి నిరాకరించారు.

రాష్ట్ర ఐదవ ప్రణాళికను గురించి కేంద్ర ప్రణాళికా మంత్రి శ్రీ డి. పి. ధర్‌తో మాట్లాడేందుకు తామే రాత్రి ఢిల్లీ వెడుతున్నామని శ్రీ త్రిపాఠి చెప్పారు. ఆయన ఆర్థిక మంత్రి శ్రీ చవాన్‌ను కూడా కలిసికొంటారు.

అస్వస్థగా ఉన్న ప్రధాన మంత్రిని కలిసి కొనడానికి కూడా ఆయన ప్రయత్నిస్తారు.

## భార్యశీలం శంకించి హత్య: ఇంటికి నిప్పు

[illegible] (18) [illegible] ఈ అగ్ని ప్రమాదంలో ప్రక్క యిళ్ళు, పాటు శాల పాకలో కొంతభాగం ప్రక్కయింటి తాటాకు 20 బస్తాల ధాన్యం గల పురి, రు 6000లు నగదు కూడా దగ్ధమయ్యాయని ఈ సంఘటన జులై 12 రాత్రి జరిగిందని, ముద్దాయి రాజారావు పరారిలో ఉన్నట్లు కేసు దర్యాప్తు చేస్తున్న పోలీసు సర్కిల్ యినస్పెక్టరు శ్రీ వి. వి. కృష్ణారావు తెలిపారు.

లదనపు జిల్లా పోలీసు అధికారి శ్రీ సుకుమారన్ కూడా సంఘటన జరిగిన ప్రాంతం పరిశీలించారు. (స్వ. వి)

— — o:o — —

## ఫ్రాన్స్ అణ్వస్త్ర పరీక్ష వాయిదా ?

పపీట్, తాహితి, జులై 15 : 1973 లో ఫ్రాన్స్ తొలిసారిగా తలపెట్టిన అణ్వస్త్ర పరీక్ష పెక్కురోజులు వాయిదా పడవచ్చునని నిన్న ఇక్కడకు వార్తలు అందాయి.

పరీక్ష జరపవలసివున్న మురోరా అటోల్ (తాహితికి ఆగ్నేయంగా 1152 కిలోమీటర్ల దూరంలో వున్న ప్రదేశంలో కొద్దిరోజుల క్రిందట చక్కగా వున్న వాతావరణం ఇప్పుడు పాడయిందని ఒక వార్త వచ్చింది.

పరీక్ష జరపడానికి అనివార్యమైన హెలికాప్టర్ సాధారణంగా పరీక్షా స్థలానికి దగ్గరగా వుంటుంది. అది తాహితికి తిరిగి వచ్చింది

పరీక్ష వ్యవహారాలను చూస్తున్న అడ్మిరల్ క్రిస్టియన్ క్లావె ప్రస్తుతం తాహితి గవర్నర్‌తో కలిసి బాస్టిల్ ఉత్సవాల్లో పాల్గొంటున్నారు.

# ఎం. పి. మంత్రుల రాజీనామా : కేంద్ర నాయకత్వం ఆశ్చర్యం

న్యూఢిల్లీ, జులై 15 : మధ్యప్రదేశ్ కాంగ్రెసు శాసన సభ్యులలో విభేధాలు కొంత కాలంగా రాజుకుంటున్నప్పటికీ, రాష్ట్రానికి చెందిన అయిదుగురు మంత్రులు నిన్న రాజీనామా చెయ్యడం యిక్కడి నాయకత్వానికి ఆశ్చర్యం కలిగించింది

ముఖ్యమంత్రి శ్రీ పి. సి. సేథి నిన్న దేశీయాంగమంత్రి శ్రీ ఉమాశంకర్ దీక్షిత్ సహా కొందరు సీనియర్ సహచరులతో టెలిఫోన్‌లో మాట్లాడినట్లు తెలుస్తున్నది

## సేథికి 15 మంది మంత్రుల మద్దతు

అయిదుగురు మంత్రులు నిన్న ఉదయం తమ రాజీనామాలు సమర్పించిన కొద్దిసేపటికి 15 మంది మంత్రులు ఒక సంయుక్త ప్రకటన చేస్తూ ముఖ్యమంత్రి శ్రీ సేథి నాయకత్వం పట్ల పూర్ణ విశ్వాసాన్ని వ్యక్తం చేశారు.

పరిపాలనలో అస్థితత్వం సృష్టించడం రాష్ట్ర శ్రేయస్సునకు భంగకరమని వారు పేర్కొన్నారు శ్రీ సేథి మంత్రివర్గంలో ఆయనతో సహా 22 మంది మంత్రులున్నారు

## సేథి ఢిల్లీ పయనం

మంత్రుల రాజీనామావల్ల ఏర్పడిన పరిస్థితిని ఎదుర్కొనడంలో కాంగ్రెసు అధిష్టాన వర్గం సలహా కోరటం కోసం శ్రీ సేథి నిన్నరాత్రి భోపాల్ నుంచి ఢిల్లీ వెళ్లారు. బయలుదేరే ముందు విలేఖరులతో మాట్లాడుతూ ప్రధానితోను యితర కేంద్ర నాయకులతోనూ యీవిషయం చర్చించేముందు రాజీనామాలను గురించి తామేమీ చెప్పదంచ లేదని ఆయన అన్నారు.

ఈ దశలో తాము ఈ రాజీనామాలు వస్తాయని అనుకోలేదని ఆయన అంగీకరించారు. ఇప్పుడు అధిష్టాన వర్గం జోక్యం అవసరమని భావిస్తున్నామని ఆయన అన్నారు.

నిన్న రాజీనామా చేసిన అయిదుగురు మంత్రులు రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రులలో ఒకరైన శ్రీ డి.పి. మిశ్రా వర్గానికి చెందినవారని తాము విశ్వసించడానికి తగిన కారణాలున్నాయని ముఖ్యమంత్రి అన్నారు. తనను వ్యతిరేకించిన వారంటరూ ఆశాభంగం పొందిన వ్యక్తులని, పార్టీ నాయకుని ఎంపిక విషయంలోవారికస్పష్టమైన అభిప్రాయాలు లేవని ఆయన అన్నారు 'నేను జయటికి పోవాలన్న విషయంలో మాత్రమే వారికి ఏకాభిప్రాయం వున్నది'' అనిఆయన పేర్కొన్నారు.

శాసన సభాపక్షంలో తమకే ఇప్పటికీ మెజారిటీ వున్నదనటంలో తమ కెలాంటి సందేహం లేదని, అయితే కొందరు అసమ్మతి వర్గీయులు'' సంక్షోభాన్ని సృష్టించడానికి ప్రయత్నిస్తున్నారని శ్రీ సేథి వ్యాఖ్యానించారు.

నిన్నటిరోజంతా తాము పనిలో నిమగ్నమై వున్నందున, రాజీనామా యిచ్చిన మంత్రులలో ఒక్కరిని కూడా కలుసుకోలేక పోయామని శ్రీ సేథి తెలిపారు. కేంద్ర నాయకులతో తాను మాట్లాడామని రాజీనామాలను గురించి ప్రత్యేకంగా మాట్లాడలేదనిఆయన అన్నారు. రాజీనామాలను గవర్నర్‌కు పంపలేదని, ప్రధాని అభిప్రాయాలను, ఢిల్లీలోని ఇతర నాయకుల అభిప్రాయాలను తాము తెలుసుకునేవరకు అవి తమ పరిశీలనలోనే వుంటాయని ఆయన తెలిపారు.

ఆయనకు వ్యతిరేకంగా ప్రారంభమైన సంతకాల ఉద్యమాన్ని గురించి ఒక విలేఖరి ఆయనతో ప్రస్తావించగా, అసమ్మతి వర్గీయులు చాలినన్ని సంతకాలు సేకరించివుంటే, రాజీనామా చెయ్యడం అనేది జరిగి వుండేది కాదని లోకజ్ఞానంతో ఆలోచిస్తే తమకు తోస్తున్నదని శ్రీ సేథి చెప్పారు.

శ్రీ డి. పి. మిశ్రా ముఖ్యమంత్రిగా వున్నప్పుడు 1966—1967 మధ్య "గులాబిచనా" కుంభకోణంపై ఉత్తర్వు చేయబడిన దర్యాప్తు గురించి ప్రస్తావిస్తూ, దానికి సంబంధించిన ఆరోపణలనుంచి ఆయా వ్యక్తులను విముక్తి చేసేందుకు ఆ ఉత్తర్వు జరిగిందని ఆయన అన్నారు.

మధ్యప్రదేశ్ శాసన సభ వర్షాకాల సమావేశం నిర్ణీత కార్యక్రమం ప్రకారం జులై 23న ప్రారంభమవుతుందని శ్రీ సేథి చెప్పారు

— — — :o:— — —

# కృష్ణా జిల్లాలో మంచినీటి పథకాలపై ఈఏడు 16లక్షలుఖర్చు

బందరు, జులై 15 : కృష్ణా జిల్లా పరిషత్ ఏడవ స్థాయి సంఘంవారు 1972-73 రివైజ్డు బడ్జెట్‌ను 1973-74 బడ్జెట్ అంచనాలను ఆమోదించారు. కార్యదర్శి శ్రీ జి.వి. రెడ్డయ్య బడ్జెట్ అంచనాలను సమర్పించారు. చైర్మన్ శ్రీ పి. కోటేశ్వరరావు అధ్యక్షత వహించారు.

1973-74 బడ్జెట్‌లో రాబడులు రు 43585716లు కాగా వ్యయం రు—34294420 లుగా ఉంది.

రు 1017000లు, సెకండరీ విద్యకు రు 1480000లు సాంఘిక సంక్షేమంకు కేటాయించారు. రు1622500లు గ్రామీణ మంచినీటి సరఫరా పథకాలకు కేటాయించారు. స్థాయి సంఘం అధ్యక్షులు కలెక్టరు శ్రీ కె. ఆర్. వేణుగోపాల్ సమావేశానికి హాజరయ్యారు. (స్వ. వి)

## మైనర్ బాలికను లేవతీసుకుపోయిన నేరానికి జైలుశిక్ష

ఒంగోలు, జులై 15 : తల్లిదండ్రుల అనుమతి లేకుండా అక్రమంగా శారీరక సుఖం అనుభవించడానికి మైనర్ బాలికను ఎత్తుకుపోయినందుకు వి. ఇమాంసాహెబ్‌కు కందుకూరు జుడిషియల్ ఫస్టు క్లాస్ మేజిస్ట్రేటు శ్రీ జాస్పర్ ఒక సంవత్సరం కఠిన జైలు శిక్ష విధించారు. ఒంగోలు సమీపంలోని టి. నాయుడుపాలెం నుంచి ఎత్తుకుపోవడం జరిగింది. ఆ బాలిక 1—10—53న జన్మించింది. 3—6—71న వివాహం జరిగింది.

ప్రాసిక్యూషన్ కథనం ప్రకారం ముద్దాయిలు కడపకు చెందినవారు. అతను అతని సోదరుడు టి. నాయుడుపాలెంకు వచ్చి జాకెట్ గుడ్డలు అమ్ముతూ ఆ బాలికతో చెలిమి చేశారు. హైదరాబాద్ రావలసినదిగా ఇమాంసాహెబ్ ఆమెను ప్రోత్సహించాడు. అక్కడ సినిమాలలో చేరుస్తానన్నాడు. 21—8—71 అర్ధ రాత్రి ఆమెను మోటారు సైకిలుపై ఒంగోలు తీసుకు వచ్చాడు. అక్కడనుంచి వరు హైదరాబాద్ వెళ్ళారు. టంగుటూరు పోలీసులు కేసు దర్యాప్తు చేశారు. ముద్దాయిలను కను గొన్నారు. హైదరాబాద్ అమర్‌పేటలో ఆ బాలిక దొరికింది. ముద్దాయి సోదరుని మేజిస్ట్రేట్ వదలివేశారు. స .వి.

———:o:———

## ఆకలివల్ల బీహార్‌లో 18 మంది మృతి

పాట్నా, జులై 15 : పాలమావు జిల్లాలో గడచిన నెలన్నర రోజుల్లో ఆకలిబాధవల్ల 18 మంది మరణించారని బీహార్ ఎస్. ఎస్. పి. అధ్యక్షుడు, శాసనసభ్యుడు శ్రీ పూరన్‌చంద్ నిన్న ఆరోపించారు.

రాష్ట్రమంతా తీవ్రమైన దుర్భిక్షానికి గురిఅవుతున్నప్పటికీ, చోటా నాగపూర్, పాలమావుజిల్లాలలో పరిస్థితులు ఇంకా అధ్వాన్నంగా వున్నాయని ఆయన విలేఖరులకు తెలిపారు.

## ఎల్లందుతాలూకా గ్రామంలో సమైక్యతా వాదుల విజయం

కొత్తగూడెం, జులై 15 : ఎల్లందు తాలూకా సుజాతనగర్ గ్రామ పంచాయతీలో రెండువార్డులకు జరిగిన ఎన్నికలో సమైక్యతా, వేర్పాటు సమస్యపై తీవ్రమైన పోటీ జరిగింది. ఈ పోటీలో సమైక్యతా వాదులు నెగ్గారు. వీరిలో ఒకరు ప్రముఖ కాంగ్రెస్‌వాది శ్రీ చారుగుండ్ల రంగారావు, ఉభయులూ మంచి మెజారిటీలతో గెలుపొందారు.

ఓడిపోయిన వేర్పాటుదారులలో ఒకరు ధరావతును కోల్పోయారు.

గెలిచిన వారిని ఊరేగింపుతో వూరంతా త్రిప్పారు. వీరు ఉభయులూ మాజీమంత్రి శ్రీ జలగం వెంగళరావు అనుచరులు.

## బంగ్లాదేశ్ రాజ్యాంగం సవరణ

### యుద్ధనేరాల విచారణకు వీలుగా

ఢాకా, జులై 15 : బంగ్లాదేశ్‌లో మానవాళి పట్ల అపచారాలను, జనహత్యను, యుద్ధ నేరాలను చేసిన 195 మంది పాకిస్తాన్ యుద్ధ ఖైదీల విచారణకు వీలుగా రాజ్యాంగంలోని కొన్ని నిబంధనలను సవరించే బిల్లును బంగ్లాదేశ్ పార్లమెంటు రాత్రినిన్న ఏకగ్రీవంగా ఆమోదించింది.

సమావేశానికి హాజరైన 257 మంది సభ్యులలో 254 మంది బిల్లుకు అనుకూలంగా వోటు చేశారు. ఒక ప్రతిపక్ష సభ్యుడు ఇద్దరుఇండిపెండెంట్లు ఓటింగ్‌లో పాల్గొనలేదు.



Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.